భద్రగిరి

# శ్రీ రఘురామ శతకము

రచయిత :

విద్వాన్ భాగవతుల వెంకట సుబ్బారావు

ఆంధ్రోపాధ్యాయులు, మ్యునిసిపల్ హైస్కూలు,

నరసరావుపేట.



త్యాగరాజ గ్రంథమండలి తరఫున

శ్రీ కృష్ణా బుక్‌డిపో, తెనాలి.

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# తొలిపలుకు

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా"

(భాగవతము).

అని భగవ దనుగ్రహ సంపాదనమునకుఁ దొమ్మిది భక్తి మార్గములు చెప్పఁబడినవి. ఇందొక్కొక్క దానితోఁ దరించిన వా రొక్కొక్కరు గలరు. వీనిలో గవితా కైంకర్య మనునది కీర్తన భక్తిలోనిది.

"శ్లో॥ చతుర్విధా భజంతే మాం బుధా భావ సమన్వితాః
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ"

(భగవద్గీత).

అని భగవద్భజనము సేయు నల్వురు భక్తులలో నార్త భక్తుఁ డొకఁడు. ఆర్త భక్తుఁడు మాయామయ ప్రపంచమున నిస్సార మగు సంసారములో నాత్మశాంతిని గానక యార్తుఁడై కడుపులోని యార్తిని పరిపరివిధముల భగవంతునికి నివేదించు కొనుచున్నాఁడు. అట్టి యార్తి ప్రలపితములే శతకములు మున్నగు స్తోత్ర పాఠములు.

భగవంతుని తోడి నిరంతర సంబంధమునకు కవితాశిల్పము మిక్కిలి తోడ్పడుచున్నది. భగవ దుద్దేశకముగా కవిత జెప్పునపు డుపక్రమోప సంహారములలో నేమి, భావకల్పనలో నేమి, ఉద్దిష్టార్థమును బద్యములో నిమిడించుకొను నప్పుడేమి, సంతృప్తి కర

ముగాఁ బద్యము వ్రాసిన తర్వాతనేమి, కలుగు తన్మయత యనుభవైకవేద్యము. ఇతర వ్యాసంగ నివర్తక మగు నుద్దామ ధ్యాన గరిష్ఠత గలిగినపు డెట్లయిన నేమి భగవత్ప్రాపకమే గదా!

ఉడుత కుడుతభక్తి యున్నట్లు శ్రీ భాగవతుల వెంకట సుబ్బారావుగారు తమకు భగవంతుఁడు ప్రసాదించిన వాక్కును భగవత్కీర్తనకే వినియోగించి తమ కడుపులోని యార్తిని శతక రూపమున శ్రీరామునకు నివేదించుకొన్నారు. చిత్తశాంతి కిదియు నొక తిన్నని సాధనము గదా!

బాల్యదశలో శ్రీ వెంకట సుబ్బారావుగారి కవితా కుమారి భగవత్స్తుతికి వెడలినది. కావున భావిదశలోఁ బ్రౌఢ వచస్కయై భగవదనుగ్రహ పాత్రురాలు కాఁగల దని యాశించు.

కవితాసామ్రాజ్యము
నంద్యాల
సుభాను సం. మార్గ కృ. 2
18—12—43

శ్రేయోభిలాషి
సిద్ధాన్త, కావ్యతీర్థ
మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి
మునిసిపల్ హైస్కూలు
ప్రధానాంధ్ర పండితుఁడు

# సూచన

"యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్య చరితమ్
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః॥"

అని మురారి కవి వాక్యమున్నది. అనగా శ్రీరాము గుణవర్ణన కన్న మిన్నయగు నాయకుని మహోత్కర్షము గానము. కాన నట్టి యుత్తమ నాయకునకుఁ దన యార్తిని సులభశైలిలో శతక రూపమున నివేదించుకొన్న నీ శ్రీ భాగవతుల వేంకట సుబ్బారావుగారి కవనము సంతతాదరపాత్ర మగుటకు సందియము లేదు.

మఱియు "భక్త్యా తుష్యతి మాధవో నచ గుణైః భక్తి ప్రియో మాధవః" అనునట్లు పద్యము లందు కవి యొక్క భక్తి సముద్ఘాటితము; దానికిఁ దోడు శ్రీ రామభక్త శిరోమణి యగు 'శ్రీ త్యాగరాజ' సేవాకైంకర్యములకుగా నీ గ్రంథ ముపయోగపడునట్లు శ్రీ వేంకట సుబ్బారావుగారు స్వత్వమును విడుట కడుంగడు ముదావహము.

ఇట్టి యుత్తమ రచన గల శతకముతోఁ దన యార్తి దొలఁగించుకొన్న వీరి యీ పద్యములను బఠించు పాఠక లోకము గూడ శ్రీ రఘురామానుగ్రహపాత్రు లగుదురు గాత మని నా యభిప్రాయము.

ఇట్లు,

నరసరావుపేట
10—10—47

విద్వచ్ఛిరోమణి, ఉభయ భాషాప్రవీణ
లంకా సీతారామశాస్త్రి
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు

# విజ్ఞప్తి

1942 వ సం॥ లోఁ గొన్ని కష్టగండ్లకులోనై నేనీ కందపద్య శతకమును శక్తికొలఁది వ్రాసి నా యార్తిని శ్రీరామచంద్రునకు నివే దించి స్వస్థతఁ జెందితిని. అవి యట్లుండె.

నే నాంగ్ల భాషను నేర్చుతఱి మ. రా. రా. శ్రీ కవికొండల పురుషోత్తం పంతులుగారు నా గురువర్యులలో నొక్కరు. వా రొనర్చు పుణ్యకార్యములకును, వారి (సతీపతుల) జీవికకు నీ గ్రంథమును దోడ్పాటుగఁ గోరితి. ఓపిన వారికి త్రికరణ శుద్ధిగ సత్ప్రహస్యలతో సమర్పించుచుంటిని. పెద్దల చాటువాఁడ నగుట నిందలి దోషము లెట్టి వైన బుద్ధిమంతులు మన్నింతురుగాక !!

'సర్వే జనా సుఖినో భవంతు'

ఇట్లు, బుధజన విధేయుడు
విద్వాన్
భాగవతుల వేంకట సుబ్బారావు

# కృతజ్ఞత

నా ప్రియ శిష్యుఁడైన చి॥ భాగవతుల వేంకట సుబ్బారావు భక్తిరస ప్రధాన మగు నీ శతక రత్నమును విజ్ఞప్త్య దాహృత పర మార్థ రూపమున నా కొసంగిన వీని గురుభక్తి కెంతయు కృతజ్ఞుఁ డను. భగవానుఁ డీ చిరంజీవికి శ్రీరామ రక్షయగుఁ గాక యని యాశీర్వదించు చున్నాఁడను.

ఇట్లు, బుధజనవిధేయుడు
నర్సారావుపేట
కవికొండల పురుషోత్తం పంతులు
సద్గురు శ్రీ త్యాగరాజ శిష్య పరమాణువు

శ్రీ రామచంద్ర  పరబ్రహ్మణేనమః

భద్రగిరి

# శ్రీ రఘురామ శతకము

శ్రీరామః కల్పవృక్షో మే - విరామ స్సకలాపదః।
అభిరామ స్త్రిలోకానాం - రామః క్షేమం కరోతునః॥

రామచంద్ర దయాసాంద్ర రఘువీర నృపోత్తమ।
లోచనాభ్యాం కృపాపూర్ణ పూర్ణాభ్యాం మాం విలోకయ॥

శ్రీ మానినీ మనోహర,
కామిత మందార, లోక కల్యాణ కరా
కోమల మేఘ శ్యామా,
శ్రీమ ద్భద్రాద్రి ధామ, శ్రీరఘురామా! ౧

వాసవ ముఖ దేవ గణ
వ్యాస పరాశర శుకాది పరమ మునీంద్రో
పాసిత చరణ సరోజ! ద
యాసాగర! మోక్షదాయకా! రఘురామా! ౨

శరణంబులు భవసాగర
తరణంబులు, పాతకాంధ తమసార్క లస
త్కిరణంబులు, తావక మృదు
చరణంబులు నాకు దిక్కు జానకిరామా! ౩

ఏనాఁటి పుణ్య ఫలమో
యీనాఁడీరీతి నిన్ను నింతఁగఁ గొలువం
గా నబ్బె భాగ్య మిపు డీ
పై నీ చిత్తమ్ము నాదుభాగ్యము రామా! ౪

కడచున్ శైశవ మాటల
నడఁగున్ దారుణ్య మింద్రియపరత్వమునన్
నడచున్ ముదిమి మతిభ్రమ
నెడ మేదీ? నిన్నుఁ గొల్వ నిఁక రఘురామా! ౫

భావాతీత, మహేశ్వర,
దేవా, చిద్రూప, నిత్య, దీనోద్ధరణా,
సేవాప్రీత, పరాత్పర,
కావవ? భవవార్ధి దాఁటఁగా రఘురామా! ౬

కలకండ కన్నఁ దీయని
ఫలరసముల కన్నఁ బిండి వంటల కన్నన్
లలి నా జిహ్వాకు నీ ని
ర్మల నామామృతమె పచ్య మైనది రామా! ౭

ఓంకార ప్రతిపాద్యము
సంకట హారణంబు మోక్ష సామ్రాజ్యదమున్
కింకర బహు జపితము క్షే
మంకర మగుఁగాదె నీదు మంత్రము రామా! ౮

నీయముల కథాశ్రవణము
ధ్యాయని గుణకీర్తనంబు పదసేవనమున్
దోయజ నయనా! కలుగం
జేయుము ప్రతిజన్మమందు శ్రీరఘురామా! ౯

ధనముల్ ధాన్యము లిండ్లును
వనితలు సంతతులు వస్త్ర వాహనములు నీ
యనుకంప లేమి వ్యర్థము
లనఘా, దీవెన లొసంగి యరయుము రామా! ౧౦

సురలాదిగఁ గల జీవులు
పురుషార్థము లంది దివ్యభోగంబుల పెం
పరుదారఁ గనుట నీదగు
కరుణాతిశయంబు వడసిగద రఘురామా! ౧౧

ఎప్పటి కప్పుడె యసువులు
ముప్పున వర్తించు; ఋణము పోలివో దింటఁ
గుప్పలు వ్యాధులు; సుఖమెపు
డప్పా దయఁజూడ వేమి న్యాయము? రామా. ౧౨

జపదాన వ్రతనిష్ఠలు
తపములు ధర్మాదులేమి తడవను; దమకం
బిపుడెట్లొగలిగె నీపై;
నెపమెన్నక నన్నుఁ గృపఁగణింపుము రామా! ౧౩

ఏలావిద్యలు? విభవం
బేలా? స్తవనీయగుణము లేలా? రూపం
బేలా? యపార భుజబల
మేలా? నీకృప లభింపదేనియు రామా! ౧౪

నీనామ సహస్రం బే
మానవుఁడు పఠించునో సమాహితమతియై
వానిది జన్మము సౌఖ్యము
నానందము నిండు నందు నరయఁగ రామా! ౧౫

ముర సంహార! ముక్తిప్రద!
పురుషోత్తమ! చక్రహస్త! పూతచరిత్రా!
కరిరక్షక! కరుణాకర!
శరణము మాం పాహి పాహి జానకి రామా! ౧౬

నాకస్సుఁ బాపి మూర్ఖుం
డేకడ నొకఁడుండఁ డనుచు నేమొఱ లిడిసన్
జేకొనవు నాదు మనవి నిఁ
కేకరణిన్ బ్రదుకఁగలనో యిలపై రామా! ౧౭

నిను వర్ణింపని నాలుక
నినుఁ జూడని కనులు నిను గణింపని మనమున్
నినుఁ బూజింపని కరములు
నినుమ్రొక్కని శిరము నుండనేమిర రామా! ౧౮

నీవే తల్లివి, తండ్రివి,
నీవే నా బాంధవుఁడవు, నీవే గురుఁడున్
నీవే సఖుఁడవు సర్వం
బీవే నా నోముపంట యీవే రామా ! ౧౯

కల్లైన నన్యదైవం
బులఁ గొల్వను గొల్చువారి పొత్తునఁ బోవన్
తలపోయ, ముంచు తేల్చుము
పలుకులు వేయేల నీదె భారము రామా ! ౨౦

కరివరుని గుహు నహల్యను
నరునిన్ ద్రౌపదినిఁ గాఁచినావఁట గాదా
శరణంచు వేఁడు కొంటిని
గరుణింపర నన్నుఁ గావఁగా రఘురామా ! ౨౧

చేసితిఁ గనియో కానకొ
దోసంబు లనంతములుగ దుర్మతినై నా
చేసినవి యెత్తి పొడువక
దాసునిగా నేలుకొమ్ము దశరథరామా ! ౨౨

మును నా పుట్టుక లెన్నో
కని కానక చేసి నట్టి కర్మము లెన్నో
యని వార్యం బగు నీబం
ధన మిప్పటికైనఁ ద్రెంపఁ దగదా రామా! ౨౩

కొండంత ధనము గూర్చినఁ
బండిత వరుఁడైన సత్ప్రవర్తనుఁడైనన్
గొండొక మీసేవారతి
నుండనిచో ముక్తిఁ బొందునొకో రఘురామా! ౨౪

ఈ పాప కూపమునఁ బడి
వాపోవుచు నుంటి నడ్డుపడు వారికినై
యాపద్బాంధవ! యొడ్డును
జూపెదొ? మఱి యిందె మడిగఁ జూచెదొ? రామా!

నిను నే వేఁడక మానను
వినుదువో నాగోడవ లేక వినవే వినవో
మిను మన్నేకంబైనను
నిను వీడెడి వాఁడఁగాను నిజముగ రామా! ౨౬

వారిధి గట్టుట కంటెను
గౌరీపతి ధనువు విఱచుకంటెను రక్షో
నాథము ద్రుంచుట కంటెను
భారమ ? యీ దీనుఁ బ్రోవ భవహర రామా. ౨౭

కొట్టినఁ గోపించిన మఱి
తిట్టిన దీపించినన్ మదిన్ గలఁగఁగఁ బోఁ
దట్టిన నీచే నయ్యెడి
దెట్టిది యేన్ నాకు సుఖదమే యగు రామా ! ౨౮

అందెలు గజ్జెలు బ్రహ్మా
నందంబుగ మ్రోయ దశరథాధిపు మ్రోలన్
జిందాడు జగన్మోహన
సుందర రూపంబు నాకుఁ జూపుము రామా ! ౨౯

పరిపక్వాంతః కరణులఁ
గరుణించుట యంత గొప్పకార్యంబగునా ?
పరుషాత్ములఁ బ్రోఁచుటయే
ఖరివిగఁ బేర్కొనఁగఁ దగిన బిరుదము రామా ! ౩౦

నాకేమో త్రవ్వియుఁ దల
పైకెత్తు మటంచు వెంటఁ బడితిన ? నిను నా
వాకిలి గావు మటంటిన ?
కాకున్న మఱేల కరుణఁ గావవు రామా ! 3౧

పరదార ధనముఁ గోరును
బరోన్నతికి ముక్కు విఱుచుఁ బాడుమనసు లో
మఱచును దన తప్పుల నె
వ్వరి నమ్మదు దీని మదము పట్టుము రామా ! 3౨

పరమేశ భక్తవత్సల
శరణుహృషీకేశ వరద జగదాధారా
కరుణింప వేఁడెదను నీ
చరణాంబుజసేవ యొకటి చాలును రామా ! 33

నిక్కెడు తాపత్రయమునఁ
జిక్కిరవం తయిన నిన్ను సేవింపక యే
దిక్కును లేదని యిప్పుడు
పొక్కుచు నున్నాఁడ నన్నుఁ బ్రోవర రామా ! 3౪

శరణాగత సంరక్షణ
బిరుదాంకుఁడ ననుచు విఱ్ఱ వీఁగెదవో యీ
సరసత్వ మెట్టిదో ననుఁ
సగణించిన యపుడె తెలియఁగా నగు రామా! 3౫

ఇలఁ బ్రోఁచు నీవె యెంగిలి
ఫలములఁ జవిఁ గొంటి వట్టివాఁడవు నాకె
ట్టులు కల్మి గూర్తు? విఁక నీ
కల రూపును జూపు తృప్తిఁ గందును రామా! 3౬

నాతల్లి జానకీ సతి
నాతండ్రివి నీవె; లక్ష్మణార్యుఁడె సఖుఁడుఁగ
వాతాత్మజాది వానర
జాతమె బందుగు; లిఁ కేల జడియుదు? రామా! 3౭

చదువుల్ నేరుచు నప్పుడె
పదకము చెడఁగా భవాబ్ధిఁ బడఁద్రోసితి; వ
య్యది చాలకనా? యొసఁగితి
మదిఁ బండని భక్తి నేమి మాన్యత? రామా; 3౮

శరణన్న వైరితమ్ముని
గరుణారస దృష్టినుంచి ఘనుఁ జేసిన నీ
సరియేఁ డీ ముజ్జగముల
బరయఁగ నీ కీవె సాటి యగుదువు రామా ! ౩౯

తమి నెల్లప్పుడు నీపుం
త్రము నా జిహ్వాంచలమునఁ దనరారెడు భా
గ్యము నిమ్ము నాకు; నదియే
యమృత పదంబబ్బి నట్టు లగు రఘురామా! ౪౦

నీ నామరుచి మహేశుఁడు
నీ నారాచంపుశక్తి నీరధియును నీ
దా నంఘ్రిమహిమ మునిసతి
కానంగలరైరి చక్కఁగా రఘురామా ! ౪౧

వరమేమి వలదు నీపద
సరసీరుహ భక్తి యొకటి చాలును; నదియే
వరణీయము; దయసేయఁగ
మఱవక యర్థింతు నిన్ను మఱిమఱి రామా! ౪౨

చెడుగఁడఁ గష్టుఁడ ద్రోహిని
గడుసరినిఁ గొండెకాఁడఁ గపటాత్మకుఁడన్
జడమతి నిటువలెఁ జెడి యి
ప్పుడు నిన్ శరణంటి; నన్నుఁ బ్రోవర రామా! ౮౩

మేరు నగధీర! శౌరి!
భూరిశుభాకార! భక్తపోషణ శీలా!
కారుణ్యామృత వార్ధీ!
రారా యభయం బొసంగరా రఘురామా! ౮౪

అన్న ల్దమ్ములు చుట్టా
లున్నా రొక లక్షమంది యుండిన నేమీ?
న న్నుద్ధరించు వా రిం
దున్నారా? నీవు గాక యొప్పుగ రామా! ౮౫

పాపిష్టి దేహ మిది యే
మో పడిపోనైనఁ బోదు పూర్ణారోగ్యం
బా? పొంద దిసీ రోసితి
నీపట్టున నన్నుఁ బ్రోవవే రఘురామా! ౮౬

మంచియొ చెడ్డయొ యెది ప్రా
ప్తించిన నే జంకఁబోను దీయక నీ పా
దాంచిత మగు భక్తినె ని
శ్చంచలముగ నిందు నంగు జరుపుదు రామా! ౪౭

కోరను ధనధాన్యంబులు
కోరను కామాదు; లేమి కోరను మఱి నే
గోరున దొక్కటె; యది నీ
కారుణ్యము దాని నిచ్చి కావవె రామా! ౪౮

చావం గాలము వచ్చిన
నే వైద్యుఁడు ప్రోఁచునో మఱే వేల్పులు ద
న్నే విధిఁ బ్రోఁతురొ యని ని
న్నావంతయుఁ గొల్వఁ డెట్టి యతియును రామా! ౪౯

కలనైన నగుచు నైనను
నలుకవచేనైన భీతినైనను నీ ని
ర్మల వర్ణద్వయ మెవ్వఁడు
తలఁచునొ యవ్వాఁడె జ్ఞానధనుఁ డగు రామా! ౫౦

పరకాంతఁ గవయఁ గోరిన
పరమాత్ములు బాగుపడరు పాడౌదురటం
చురునీతిఁ దెలుప రావణుఁ
బరిమార్చితి వీర! నీతిపర! రఘురామా! ౫౧

కలఁడా? దేవుఁడు? మ్రొక్కినఁ
గలదా? మోక్షం బటంచుఁ గల్గున లన్నఁ
బలుకవు నో ధూమ్రయింపవు
తెలియవో? వినరాదో? భయమొ? తెల్పుము రామా!

ఉందువు దవ్వున, దాఁపున
నుందువు, లోభాగ మందు నుందువు, వెలిగా
నుందువు, పరమాణువు నం
దుందువు, బ్రహ్మాండమందు నుందువు రామా! ౫౩

అరిషడ్వర్గము తోడుత
దురమయ్యెడి నాకుఁ దోడు దొరకరు దిట్టల్
కరుణా నా పక్షం బయి
యరివర్గముఁ గూల్చి యిడు జయమ్మును రామా! ౫౪

చావుంబుట్టువు లీభువి
నే వారికి లేవు? వింతయే యది? గానీ
ప్రోవు మనాయాస మ్మగు
చావును మోక్షమ్మొసంగి చక్కఁగ రామా. ౫౫

కరిరాజవరద, కేశవ,
సరసిజ గర్భాదిదేవ సన్నుతచరితా,
దురితారణ్య దవానల,
పరమాత్మా నన్నునేలవా? రఘురామా....!! ౫౬

కుక్షిని బ్రహ్మాండంబులు
దక్షతఁ బోషించునట్టి తండ్రివి నన్నున్
రక్షించు టెంతపని? నీ
యక్షయకృపఁ జూపు మాశ్రితావన రామా! ౫౭

చూచితి భద్రాద్రిని, మఱి
చూచితి గౌతమిని, సీతఁ జూచితి నిన్నున్
జూచితి, సౌమిత్రిని నే
జూచితి జన్మము తరించె శుభకర రామా! ౫౮

కరిపై, విభీషణునిపై
నరుపై, ప్రహ్లాదుపైన, నందాదులపైఁ
బరఁగం గల్గిన నీ కృపఁ
బఱపుము నామీఁదఁ గొంత, భవహర రామా! ౫౯

వారా వీరా దిక్కని
తారాడుటె గాక బెడఁద తప్పింతురె వా;
రే రీతినైన నీవే
పోరాడి బెడంద లడఁపఁ బోలుదు రామా! ౬౦

ఎన్నా ళ్ళీ ఋణబాధలు
నాన్నా పడఁ జాల నోయి నా లోపము లే
మున్నను నోరిచి నీయెడఁ
దిన్నఁగఁ జేయూఁత యొసఁగి తేర్పుము రామా! ౬౧

అంతం బున్నది జలధుల
కంతం బున్నయది యీ యజాండంబునకున్
ఇంతకు సంసారమునకు
నంతంబున్నట్లు తోఁప దయ్యెను రామా! ౬౨

జగముల సృష్టింపను, నరు
దుగఁ బ్రోవను, మఱియు వానిదోరింపంగ౯
త్రిగుణాకారుఁడ వైతివి
జగదీశా ! భద్రశైల జయరఘురామా ! ౬౩

అమృతం, బవ్యయ మక్షర
మమల మనంతం బనామయ మకాయ మనా
ద్యమబోధ్యము నై వెల్గెడు
విమల బ్రహ్మంబు నీవె విశ్రుత రామా ! ౬౪

ధరణీ భార నివారణ
సురసంతానార్తి హరణ ! శోభన చరణా !
పరమాదరణంబున నను
గరుణ౯ భవ బాధ వాపి కావవె రామా ! ౬౫

చాలును శ్రుతి పాఠంబులు
చాలును జపములును, దపము చాలును వ్రతముల్
చాలును, గ్రతుయోగాదులు
చాలును నీస్మరణ గల్గఁ జాలిన రామా ! ౬౬

చతురు దధిక్షితి నేలిన
పతులెందరు లేరు? వారు బారెఁడు నేలన్
గుతుకమ్మునఁ గొంపోయిరె?
*మతిచెడి వర్తింపనేల? మర్త్యులు రామా! ౬౭

"అలఘుమతి నెవఁడు నన్నిల
నాలయునో యవ్వాని పాప మూడ్తు"నని గదా!
పలికితి వా పలుకే దీ
పలుకనె మోసంబ? శక్త్యభావమ? రామా! ౬౮

నిను నమ్మిన నీ భక్తుని
వనటను మానింపకున్న వచ్చును నీకే
యనివార్యంబుగ నపయశ
మనవద్య! దాని నోర్తువా? రఘురామా! ౬౯

కర్మములఁబట్టి జగముల
నిర్మింతువు గానఁ గర్మ నిఘ్నుఁడ నీవున్
నిర్మల! యటు గా దందువ
యర్మిలి నా పాప మేల యణఁపవు రామా! ౭౦

---

* మతిచెడినవారు = దుర్మార్గులు

ని న్నగ్గించెడి పుణ్యుని
మన్నించుట యేమి గొప్పమహిమం బయ్యా ?
ఎన్నడు పాపుని తప్పుల
మన్నింతువొ యపుడె నీదు మహిమము రామా ! ౨౦

వేదో _ క్త విహిత కర్మము
లాదిగ సర్వంబు విడిచి యైచ్ఛికముగ నే
వాదాడి నా _ స్తికుఁడనై
పేదవడియు నుంటి నింకఁ బెనుచుము రామా ! ౨౨

ఎందుల నీ పాదార్చకు
లుందురొ నీ వుందు వచట నుందురు మునులున్
గ్రందుకొనియుండు తీర్థము
లందే వేదార్థ మిది జనార్దన రామా ! ౨౩

పగతురఁ గూల్చుటకంటెను
మృగరాజుం బట్టుకంటె మదకరితోఁడన్
తెగబోరుకంటెఁ జి _ త్తము
తెగువన్ శిక్షించు టదియ తేఁకువ రామా ! ౨౪

కరివరుతో దోమయు, భా
స్కరుతో మిణ్గురుపురుంగు, గజరిపుతో డ౯
నరుఁడును సరియై నప్పుడె
సరి నీ కన్యులు ధరిత్రి జానకిరామా ! ౨౫

ఆపద లెన్నో తప్పెను
ప్రాపించెను మూర్ఖు లడ్డుపడినను శుభముల్
పాపలఁ దల్లివిధంబునఁ
గాపాడిన నిన్ను మఱువఁ గలనా ? రామా. ౨౬

రాగద్వేషము లుడిగియుఁ
ద్యాగము యోగంబు గూడినప్పుడె నా కే
లాగున సమకూరును నీ
భాగవతులఁ గూడియుండు భాగ్యము రామా ! ౨౭

వననిధి భూమీస్థల మగు
ననలము మంచౌను శత్రుఁ డతి మిత్రుం డౌ
ఘన విష మమృతం బై చను
నినుఁ గొల్చిన వాని కెందు నేనియు రామా! ౨౮

నిను మిగులఁ బొగడువారినిఁ
గనుఁగొన వెంతైనఁ దెగడఁ గలవారికి ము
క్తినిఁ జేకూర్చెద వటు గా
వున నను వగు బ్రోవ గంటిఁ బో రఘురామా! ౭౯

కలి ప్రథమ పాద మందే
కుల మత భేదమ్ము లుడిగెఁ గూలె నిగమముల్
పలువిధ కుచేష్ట లెసఁగెను
గలి పూర్ణంబైన నేమిగతియో రామా! ౮౦

కల్ల నిజమయ్యె, నీచుల
కెల్లర కాధిక్య మబ్బె, నే యది తగదో
యల్లదె హిత మయ్యెను మఱి
యెల్లిలన్ సుజనకోటి నేలెదో రామా! ౮౧

ఇన్నాళులుండి ఫల మే
మన్నఁగడించితివె ? యిట్టు లాకల్పాంతం
బున్నను ఫలమే ముండదు
నాన్నా! ననుఁ బ్రోవు మెట్టులైనను రామా! ౮౨

అమరస్త్రీల రమించినఁ
దమితీరదు; బ్రహ్మపదము దక్కిన నాసల్
సమయవు; జగములు మ్రింగిన
నిముడదు కోపంబిఁకెట్టు లేలెదొ రామా! ౮౩

వెలలేని మణులు మట్టిని
గలుగవె? పద్మములు బురదఁ గల్గవె? యేలా
కులములు? నీభక్తుఁడు వి
*ప్రులకంటెను మాలఁడైనఁ బూజ్యుఁడు రామా! ౮౪

జన కాజ్ఞను తలఁ దాలిచి
ఘన విపినమ్ములను దిరుగఁ గందిన నీ మె
త్తని పదములు నొవ్వారగ
నునుపుము మద్హృదయసీమ నొప్పుగ రామా!! ౮౫

## అ వ తా ర ము లు

ఖలుఁడగు సోమక దైత్యుఁడు
తొలిపల్కుల దొంగిలించి తోయధి మునుఁగన్
బలిమిని వానిం గూలిచి
వెలసిన మత్స్యావతార! వేఁడెద రామా!

* విప్రులకంటెను – అనగా భక్తిలేని (భక్తియుతులు గాని)

కలశాబ్ధిఁ ద్రచ్చువేళన్
గులశైలోద్ధరణ కేలిఁ గొనఁగొని యవ్వే
ల్పులకున్ బ్రియ మొనరించిన
తొలికూర్మము వీవె యగుదు దోర్బల రామా! ౮౭

వారాహ రూపమున నా
క్రూరుండగు హేమనేత్రుఁ గూల్చియుఁ బంటన్
ధారుణి నెత్తిన జగదా
ధారా తుభ్యం నమోఽస్తు దశరథ రామా! ౮౮

జననం బాదిగ నిను భ
క్తి నిగీర్తన సేయుబాలుఁ డెగఁ జూచిన తం
డ్రిని నఖములఁ జీల్చిన యు
గ్ర నృసింహా కృతివి నీవెగా రఘురామా! ౮౯

దనుజుం డయ్యును బలి యిం
ద్రుని పదముం గోరి తెగువ తో వెలయఁగ నా
తని త్రుళ్ళణఁ గింపఁ గ వా
మన రూపుఁడ వైతి వేమి మహిమర రామా! ౯౦

జనకుం జంపిన కోప
మ్మున ధర ముయ్యేడు మార్లు భూపుల నెల్లన్
దునిమి పితౄణమ్మును దీ
ర్చిన భృగురాముఁడవు నీవె శ్రీరఘురామా! ౯౧

క్రూరుం డగు రావణునిం
దోరించుట కొఱకు దశరథుని బిడ్డఁడవై,
పోరన్ వానిని ద్రుంచి వి
చారము లేకుండఁ జేయఁ జాలితి రామా! ౯౨

ఆధ్యాత్మిక విజ్ఞానము
విధ్యుక్తము గాఁగఁ దెల్పి విజయుని శంకన్
అధ్యవసించిన త్రైలో
క్యాధ్యక్షక! కృష్ణమూర్తి వగుదువు రామా! ౯౩

తమ భార్యల పాతివ్ర
త్యము మఱి తమ కర్మనిష్ఠ తగుబల్మి లో
కము నేచు త్రిపురదైత్యుల
సమయింపఁగ బుద్ధుఁడైన స్వామివి రామా! ౯౪

తురగంబు నెక్కి ధరము
ప్కరులన్ దెగటార్చి ధర్మసంస్థాపనమున్
జరుపఁగఁ గల్యంతంబున
నరుదెంచెదు కల్కి వీవ యాదువు రామా! ౯౫

శ్రీలక్ష్మీ నారాయణ
కాలహరణమేల నాఁడు ఘంటాకర్ణున్
ఏలీల రక్షఁ జేసితి
వా లీల న్నన్నుఁ బ్రోవవయ్యా రామా! ౯౬

ఒకమాట యొక్కబాణ
మొక్కచిత్త మొక్కపత్ని యొక్కఁడ వగు ని
న్నకలంక! మఱువ నెప్పుడు
ప్రకటిత సౌఖ్యం బొసంగు వర రఘురామా! ౯౭

ధర సత్కీర్తికి దానమె
సరసత్వాప్తికిని గాన చతురత్వంబే
నిరుపమ పదవికి జ్ఞానమె
కరుణింపుము దానినే జగన్నుత రామా! ౯౮

దంతమ్ము లూడ నప్పుడె
కాంతలు మది రోయనపుడె కాయము జరా
క్రాంతమ్ము గాని యప్పుడె
చింతింపంగ వలయు నిన్ను శ్రీరఘురామా! ౯౯

ఆధివ్యాధులు ప్రబలెను
బోధావిర్భావములును బొనుపడవయ్యెఁ
సాధించి యెట్లు నిన్నా
రాధింతునో యెఱుఁగరాదురా రఘురామా! ౧౦౦

ద్రవ్యము వినియోగించిన
సవ్యముగానగును గురుసప్త సంతానము లా
ద్రవ్యము లేక యొసంగితి
శ్రావ్యంబగు కృతిని నీకు చక్కఁగ రామా! ౧౦౧

మంగళము లోక నాయక
మంగళము దయాసముద్ర మంగళము హరీ
మంగళము భక్త పాలక
మంగళ మిదె భద్రశైల మాధవరామా! ౧౦౨

పుస్తకములకు :

కవికొండల పురుషోత్తం పంతులు
సంపాదకులు : త్యాగరాజ గ్రంథమండలి
త్యాగరాజనిలయం
నరసరావుపేట.